శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

మూఁడవ సంపుటము

త మొదలు మ

వఱకు



ఇది

కొట్ర శ్యామల కామశాస్త్రిచే

వ్రాయఁబడి

ప్రకటింపఁబడినది.



శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల,

జగన్నాథపురము, కాకినాడ.

1938



మూఁడవ సంపుటము
వెల రు. 5-0-0.



మొత్తము వెల రు. 25-0-0.



చెల్లా-లక్ష్మీనృసింహశాస్త్రి.

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

మహారాజపోషకులు.



మహారాజరాజశ్రీ శ్రీరాజా వాద్రేవు విశ్వసుందరరావు బహద్దరు
జమీందారువారు, వేగాయమ్మపేట యస్టేటువగైరా. వేగాయమ్మపేట,
తూర్పు గోదావరిజిల్లా.

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

## మహారాజ పోషకులు.



సంఘ సంస్కారణాభిలాషులును, సరసకవితా సంపన్నులును,

సాధుగుణ విభూషితులును నగు,

**మహారాజరాజశ్రీ డాక్టరు. కోటంరాజు కోటీశ్వరరావుపంతులుగారు,**

తెలుఁగు పండితులు, బి. హెచ్. యి. యస్. గూడవల్లి,

రేపల్లెతాలూకా, (గుంటూరుజిల్లా.)

# OPINION.

I am very glad to express my excessive joy in representing my personal acquaintance with the author of " Andhravachaspathya." It cannot but be assured that it is a very laborious work costing at times both his spirits and brain. It is a beautiful spectacle to see him amidst the worthy and voluminous manuscripts of his great work. I have been going there very often to spend a few minutes with the great man and during that time I used to read matter from his manuscripts, comparing the same with that contained in other books. I may venture to opine that some books give only word to word meanings, some a bit of originality, but here I see not only knowledge but also ocean of originality covering very many branches and walks of life viz literature, science, medicine, loukyam and above all paramardham too. While studying this book in comparison with other books I have referred to many kinds of dictionaries both English and Telugu of the common day use. I feel glad to expose my sincere view like many other gentlemen who have given opinions upon the same, that it is in no way inferior to any other work for it teaches us not only its main business but also much general knowledge containing here & there both Iha & Para.

Every one can experience when he goes through it that a word of importance gives so much knowledge that it occupies a number of pages of the work and at the same time instead of giving monotony it keeps us as if we were sitting learning before our true & great guru wondering at his oceanic knowledge.

The more we grow acquainted with the work the more pleasure we derive. There is no wonder in giving out my hearty opinion that when we sit with the work hours aud days pass away as if they were moments and at the some time we shall be plunged in the ocean of knowledge without the least feeling for thirst and hunger as is the case with the author always.

Lastly I am very glad to have noticed that the author has undertaken a worthy and an unparalleled work which deserves both encouragement and help of every Andhra.

CHILAKAMARRI GOPALACHARY,
Secretary,
Cocanada Taluka Pradhamika Vidyasangham,
(E. Godavari.) 5-5-38.




శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

## పండితాభిప్రాయములు.

మహారాజ రాజశ్రీ రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు
పర్లాకిమిడి. ప్రస్తుతము రాజమహేంద్రవరము.

(ఆంధ్రవాచస్పత్యమునకు నెం 1 రు చందాదార్లు).

బ్రి. శ్రీ. ఆంధ్రవిద్యావాచస్పతి కొట్రి శ్యామల కామశాస్త్రిలవారి సన్నిధికి.

సే. గిడుగు వేంకట రామమూర్తి అనేక నమస్కారములు చేసి చేయుంగల విన్నపములు:—

మహాశయా, మీరు రచించి ప్రకటిస్తూఉన్న ఆంధ్రవాచస్పత్యమును గురించి నా అభిప్రాయము తెలియజేయ వలసినదని నన్ను కోరినారు. అయితే, అక్కడక్కడ గ్రంథము కొంచెము పైపైని చూచి చెప్పేవారి అభిప్రాయమునకు ఏమి విలువ ఉంటుందని నేను గ్రంథమంతా చూడలేక, ఊరుకొన్నాను. గాని మీఆజ్ఞ దాట శక్యముకాకుండా ఉన్నందున, నేను చూచినవిషయములు ఆధారముగా నా ఆశయము మనవిచేయుటకు సాహసించినాను.

మీవాచస్పత్యములో పొరపాటులుకొన్ని ఉన్నా, ఇప్పుడున్న నిఘంటువులలో ఉత్తమమయినదని చెప్పడానికి జంకను. శబ్దరత్నాకగములో, తప్పులు లోపాలు వేలున్నవి. అట్లే శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటువులోనున్నా - మీ పుస్తకము ఆబాలగోపాలము అందరికీ ఉపచరిస్తుంది. సూర్య. నిఘంటువు సంస్కృతము చదువుకొనే వారికోసము రచించినదట; పండితుల సందేహాలు తీర్చగలదట. అయినా దానిలోలేనిమాటలు అనేకము వాచస్పత్యములో ఉన్నవి; తైపారువేసి, చూచి, మరీ చెప్పుతున్నాను.

అదేమోకాని, సూర్యా. లో ఇంగ్లీషు మొదలయిన అన్యదేశభాషలలోని మాటలు—తెలుగువారి వాడుకలో ఉన్నవే—చేరలేదు. "ఇంగ్లీషు" అనే మాటయినాలేదు. "ఆంగ్లము" అనేదీలేదు. శబ్దరత్నాకగములో "ఎకరము" "ఇన్స్పెక్టరు" మొ॥వి వందలున్నవి. వాచస్పత్యములో అన్యదేశ్యాలువేలున్నవి. ఆంధ్రసాగస్వతములో "ఇంగ్లీషు" మాటలుచేరినవే; హంసవింశతిలో ఉన్నవి. ఇంగ్లీషు నిఘంటువులో—సామాన్యమయిన దానిలోనే—"ఇండియ", "హిందూ" మొ॥వి ఉన్నవి. ఈలోకములోనున్న ప్రఖ్యాతభాష లన్నిటనుండిన్ని ఇంగ్లీషులో చేరిన శబ్దాలున్నవట! వాడుకలో వేరుతన్ని ఉన్నమాటలు భాషయొక్క అంగములు కాక తప్పదు.

ఇకను, నేటివ్యవహారమందున్న మాటలు, గ్రంథాలలో లేనిపాపాన, గ్రామ్యాలుగా పరిగణించి త్యజించిన ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించినట్టి సూర్యారాయాంధ్రనిఘంటువులో వాడుక మాటలుకొన్ని తప్పి దారిదూరినవి, ఏలాగుననో; మీరు "లక్ష్మీనారాయణీయము" లోనే "చాలా" మొ॥ శబ్దాలు చేర్చిఉన్నారు. వాచస్పత్యములో బుద్ధిపూర్వకముగానే "వాడుక మాటలు" అనేకముగా స్వీకరించి, "భాషాపరిణామము" "భాషాపరివర్తనము" మొదలయిన సిద్ధాంతములను అనుసరించిన వారయినారు.

భాషా పాండిత్యము పరిపక్వమయి ఉన్న ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ దేశములలో రచితమయిన నిఘంటువులు క్రమేణ చక్కబడుతున్నవి. ముప్పై ఏండ్లక్రితం అచ్చుపడ్డ ఆక్సఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీ మొదటి సంపుటంలోని లోపాలూ దోషాలూ తొలగించి మరి ఒకసంపుటము ఇప్పుడు ప్రకటించినారు ఆనిఘంటు రచయితలు. మనతెలుగుభాషలో "పాండిత్యము" అనదగిన ఫలము లభింపజేసే కృషి ఎవరూ ఇంకా మొదలు పెట్టలేదు. విశ్వవిద్యాలయాలలో అట్టికృషికి ఆనుకూల్యముగా ఇంకా ఏర్పడలేదు అట్టికృషి ఇంగ్లీషుభాషావిషయమున ఇంగ్లండులో 1830 వ సం॥ మొదలుకొని జరుగుతున్నది. మన తెలుగు భారతమయినా నిర్దుష్టముగా పరిష్కరించగల పండితులు ఇంకా ఆవిర్భవించలేదు. ఇంగ్లీషు నిఘంటువుమాదిరిని 1912 వసం॥ లో తమనిఘంటువు రచింపబూనుకొన్న సాహిత్య పరిషత్తువారి సాహసము లిజ్ఞులకు హాస్యాస్పదముగా కనబడినది. సూర్యారాయ నిఘంటువునున్నూ ఆక్సఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువునున్నూ హస్తిమశకాంతరమున్నది.

మీవాచస్పత్యము నిర్విఘ్నముగా సమాప్తిపొంది మీమున్ను ఆంధ్రలోకమునమున్న కీర్తిని సంపాదించుగాక.

రాజమహేంద్రవరం.
2—3—1938.

ఇట్లు,
సే. గి॥ వేం॥ రామమూర్తి.

---

## మహోపాధ్యాయ, మధ్వ శ్రీకాశీ కృష్ణాచార్యులుగారు,
## అవధాని శిరోమణి, గుంటూరు. (12—1—38).

బ్రహ్మశ్రీ, కొట్ర శ్యామలకామశాస్త్రిగారు రచించిన "ఆంధ్రవాచస్పత్యము" అనెడు నిఘంటురత్నము, ఔకారాది పదాంతమువఱకును నొకసంపుటముగా ముద్రితమయి నాకడకు వచ్చినది. దానిని నేను దాదాపు పూర్తిగాఁజూచితిని. ఏతద్గ్రంథకర్తలొనర్చిన శ్రమ సార్థకపఱచుటయేగాక, ఈనిఘంటువువలన ననన్యలభ్యమగు లాభము నొందవలసిన వారు ఆంధ్రభాషాభిమాను లందఱునైయున్నారు. ఇతర నిఘంటువులలో లేని విశేషములెన్నియో యీ నిఘంటువునందుంటచే, నిది సంస్కృతాభ్యాసముగల విద్వాంసులకుఁగూడ మహోపకారకమని నాదృఢాభిప్రాయము. ఈకాలమున నిట్టి నిఘంటువులే అత్యవసరములు.

## ఆశయము.

విద్వాన్ త్యాడీ వేంకటశాస్త్రిగారు.
శ్రీ సారస్వత పరిషత్తు.

మాడుగుల.
12-2-1938.

శ్రీయుత కొట్రి శ్యామల కామశాస్త్రి లిఖితాంధ్ర వాచస్పత్యనామక నూతన నైఘంటికాంతర్గతాకారాద్యకారాంత కకారాది ఙకారాంత శబ్ద సర్వస్వసమన్విత ప్రథమ ద్వితీయ భాగస్థ విశేపవిషయముల నుపలక్షించి మొత్తముమీఁద గీర్వాణవాచస్పత్య విషయావలోకన సంజనితానందానందానంత సంతోషిత స్వాంతుండనయి యేతద్గ్రంథకర్తృపాండిత్య సామర్థ్యంబుల నపరిమితములుగఁ బరిగణింపఁగలిగితి.

అంతర్విషయ విశేషముల నాగ్రంథ రాజమే ప్రేక్షకుల కనేకముఖంబుల నత్యంత ముద్బోధించుచుండుటంబట్టి మరల నేనక్కార్యమప్రస్తుత విస్తరహేతువుగ భావించితి.

శ్లో. సారస్వతాదివిజ్ఞానసర్వస్వమాద్రిపూర్వకమ్ ।
వాచస్పత్యంథ వేద్యజ్ఞైర్విజ్ఞైః పాఠ్యంసదాముదా ।
విజ్ఞానసమ్పదాంఘూసపాత్రియాదుస్సహదుర్గుణాః ।
తస్మాన్నాన్యమిదం తేషాంవిద్యైవజ్ఞానసాధనాత్ ॥

## ఆంధ్రవిద్యావాచస్పతి శ్యామల కామశాస్త్రిగారికి, అభినందనసభ.

(ది 7-1-38 తేది 4½ గం. నుండి 7గం. వఱకు.)

ది8-1-1938 ఆంధ్రదినపత్రిక
14వ పొరటనుండి.

మదాసు,
జనవరి 8:—

"సర్వవిధముల నిరాధారముగనున్న ఆంధ్రభాషాభివృద్ధికై ఇరువది సంవత్సరములు దుర్భరపరిశ్రమతో శ్రీ ఆంధ్రవాచస్పత్యమను అకారాది ప్రతిపదార్థపర్యాయ పద నిఘంటువును తయారుచేసిన ఆంధ్రవిద్యావాచస్పతి కొట్రి శ్యామలకామశాస్త్రిగారిని అభినందించుటకు నిన్నసాయంకాలము పచ్చయ్యప్ప కళాశాల ఆంధ్రవిద్యార్థిసంఘమువారి యాజమాన్యమున బహిరంగసభ జరిగెను. సభకు కళాశాల ఉపాధ్యాయులు, విద్యార్థులు చాలామంది హాజరైరి.

## బ్రహ్మ శ్రీ. విద్వాన్ టి. విశ్వనాథశాస్త్రిగారు సభకు అధ్యక్షత వహించిరి.

ఆంధ్రభాషాభివృద్ధికి ప్రముఖులు చేసిన చేయుచున్న కృషిని సభాధ్యక్షులు వివరించిరి. విజ్ఞానసర్వస్వము గ్రంథరూపమున తయారుచేయుటకు శ్రీయుత కాశీనాథుని నాగే

శ్వరరావుపంతులుగారు చేయుచున్న కృషిని వీరుప్రశంసించిరి. ఆంధ్రభాషాభివృద్ధికి శక్తివం చనలేకుండా పాటుపడుచున్న శ్రీయుత పంతులుగారికి చిరాయురారోగ్యములు ప్రసాదింపవలెనని వీరు దేవుని ప్రార్థించిరి. ఆంధ్రవాచస్పత్యము పండితులకు పరమానందమైనది. విద్యార్థులకు వియత్సురభి యైనది. పాఠశాలలకుఁ బారిజాతంబైనది. కళాశాలలకుఁ గల్పతరువైనది. పుస్తకభాండాగారంబులకు నిస్తుల నిదానంబైనది. కవులకు చింతామణి. నిఘంటువులకెల్ల నిరుపమానశిరోమణి. ఆంధ్రహస్తంబుల కమూల్యాభరణము. ఇందువాడుకపదములతో ప్రతిపదార్థములు, అర్థములు, పర్యాయపదములు, తద్విశేషార్థ నిఖిలపర్యాయపదములు, ప్రత్యర్థమునకు భాషాభాగాదులు, ప్రకృతివైకృతులు, రూపాంతరములు, వ్యాకరణాద్యంశములు, నాటకలక్షణములు, ఛందోలక్షణములు, కావ్యలక్షణములు, న్యాయములు, జాతీయములు, సంఖ్యాసూచకపదములు, ప్రయోగాధారములగు లోకోక్తులును గలవని కామశాస్త్రిగారు తమగ్రంథమునుండి నిదర్శనములను సభవారికి చూపించిరి. ఆంధ్రలోకము తమ గ్రంథమును స్వీకరింపవలెనని విన్నవించిరి.”

☞N. B.—విద్యార్థులును, ఉపాధ్యాయులును నిఘంటుకర్తగారు చేసిన పరిశ్రమకు శ్రీ భగవంతుఁడు వెంటనే తోడ్పడి నిఘంటుముద్రణము పూర్తిగావించుగాక యని ప్రార్థించుచు నిఘంటుకర్తగారిని కొనియాడిరి. వెంటనే ఉపాధ్యాయులును, విద్యార్థులును చందాదార్ల మగుచున్నామని హెచ్చరించిరి. సభ జయప్రదముగా జరుగుటకు తగు యేర్పాట్లుగావించిన శ్రీ పచ్చయ్యప్ప కళాశాలాధ్యక్షులను శ్రీ శ్యామల కామశాస్త్రిగారు ప్రశంసించిరి. సభకరతాళధ్వనులతో ముగిసినది.

## ఆంధ్ర విద్యా వాచస్పతి కొట్ర శ్యామల కామశాస్త్రిగారికి.

## అభినందన సభ. (ది 16-2-1938).

## కనగాల, రేపల్లెతాలూకా (గుంటూరు).

సర్వవిధముల నిరాధారముగనున్న ఆంధ్రభాషాభివృద్ధికై ఇరువది వత్సరములు అహోరాత్రములు దుర్భరపరిశ్రమగావించి ఆంధ్రవాచస్పత్యమను అకారాది ప్రతిపదార్థ పర్యాయపదనిఘంటువును తయారుచేసిన ఆంధ్రవిద్యా వాచస్పతీత్యాది బిరుదాంకితులగు బ్ర. కొట్ర శ్యామల కామశాస్త్రిగారిని అభినందించుటకు కనగాల జాతీయ బాలభారతి గ్రంథాలయమువారి యాజమాన్యమున బహిరంగసభ జరుపఁబడినది. సభకు పండితులును పాఠశాలల ఉపాధ్యాయులును, గ్రామస్థులును, డాక్టర్లును, విద్యార్థులును మున్నగువారు పెక్కుమంది హాజరైరి.

ఉభయభాషాప్రవీణ శ్రీమాన్ వేదాల వేంకట తాతాచార్యులవారు సభకు అధ్యక్షత వహించిరి.

"ధనుర్విద్య కర్జునునివలె" సాహిత్యవిద్య కసహాయశూరులై నిర్వహింపఁబూనిన శ్రీ శ్యామల కామశాస్త్రిలవారి "ఆంధ్రవాచస్పత్యము" యొక్కకృషిని అధ్యక్షులు విశేషముగ ప్రశంసించిరి. మఱియు భాషాపోషకులు వదాన్యశేఖరులునగు మహారాజులు చేయింపవలసిన పనిని శ్రీశాస్త్రిగారొక్కరు నడుముకట్టిచేయుట వింతలలోని గొప్ప వింతయనియు, ఈ మహనీయకోశ మాంధ్రమండల మాబాలగోపాలము స్వీకరింపఁదగినదనియు, ఇట్టి మహాకార్యమునకుఁబూనుకొనిన శ్రీ శాస్త్రిగారికి భగవంతుఁడు చిరాయురారోగ్యములు ప్రసాదింపవలెననియు అధ్యక్షులు దేవునిప్రార్థించిరి. పిదపపండితులు డా. కోటంరాజు కోటేశ్వరరావు పంతులుగారును, డాక్టరు ముక్కామల సోమసుందరరావు పంతులుగారును, అధ్యక్షుల ఉపన్యాసమును బలపఱచిరి. శ్రీ శ్యామల కామశాస్త్రిగారు పూర్వపు విద్యావిధానమునకును, ఇప్పటి విద్యావిధానమునకును హస్తిమశకాంతరము గలదుగాన యిప్పటి విద్యావిధానమునకు వెంటనే మార్పుగలిగించి పూర్వపురీతిని ఆంధ్రనామసంగ్రహము మున్నగు తెలుఁగునిఘంటువులను, అమరము మున్నగు సంస్కృత నిఘంటువులను ప్రారంభవిద్యగా నేర్పఱచిన యెడల భాషాభివృద్ధికి కారణమగునని విన్నవించుచు తమ "ఆంధ్రవాచస్పత్యము" లోని విషయములను సోదాహరణపూర్వకముగ నుపన్యసించి సభ్యులనానందాబ్ధినోలలాడించిరి. కస్తూరి కుటుంబరావు పంతులుగారియొక్కయు అధ్యక్షులయొక్కయు అంత్యోపన్యాసములతో సభ జయప్రదముగా కరతాళధ్వనులతో ముగిసినది.

---

బ్రహ్మశ్రీ పండిత, సోమంచి సూర్యనారాయణశర్మగారు. కరప. (19-8-37.)

నిఘంటు సామాన్యమువలెఁగాక పీఠికాకారులవాక్ప్రకారమిందు గొప్పవిశేషముగలదు. సహృదయులకొకవిజ్ఞానసర్వస్వపుఁ బోల్కియుదోఁచుటకది యొక్కహేతువు. పెక్కేల ? తమ దాల్చిన ఆంధ్రవిద్యావాచస్పతీత్యాది మహద్బిరుదావళిచే నీబృహత్కోశమునకును ప్రకృతకోశోద్ధతిచే స్వకీయఘనబిరుదజాలమునకును సార్థకత సమకూర్చు సదుద్యమమియ్యది సర్వధాస్తవనీయము.

చాలినన్ని పరికరములులేకున్నను శ్రీమంతులయాశ్రయముఁబడయకున్నను ఏసమాజమో ఏజమీదారుఁడో పూనుకొనవలసిన—ఆంధ్రభోజనకైన నచిరాచరణ సాధ్యముకాజాలని—ఈమహోద్యమమున కేవలసామాన్య ప్రజాసాహాయ్యమునందుగల విశ్వాసముతో స్వధర్మరతులై వారధిదాఁటిన వీరపావనికైవడి భాషాసాగరముఁ దరింపనుఱికిన యసహాయశూరులీయన. కాఁగాక ! అనతికాలమున వీరికృషి ఫలవంతమగు శుభసూచనా సౌరభ మితఃపూర్వమె మాఘ్రాణపర్వమాయె. "క్రియాసిద్ధిస్సత్త్వేభవతి" కదా.

ఏతత్సత్కృతి దేశభాషాభిమానుల యర్హసత్కృతినందుఁగాక ! శ్రీశ్యామలకామశాస్త్రిగారికి సత్కీర్తిసంధాయక మగుఁగాక ! !

## ఉభయభాషాప్రవీణ, బ్రహ్మశ్రీ మూలా సూర్యనారాయణశాస్త్రి

### విజయనగరము.

ఆర్యా! నమస్కారములు.

"భారతరామ కథార్థముల్ విభా! సిలఁగనగంటి పండొలిచి చేతికి నిచ్చినరీతి" (కళాపూర్ణోదయము) "లక్ష్మీనారాయణీయము"ను శుద్ధాంధ్ర ప్రతిపదార్థపర్యాయపద నిఘంటువును బాల్యమున వ్రాసినమీరు నేఁడు "ఆంధ్రవాచస్పత్యము"ను ప్రతిపదార్థ పర్యాయ పద నిఘంటువును ఉభయభాషలయందును సమకూర్చుటయనఁ "గొట్టిన పిండియయ్యె." ఎన్ని వేలు ఖర్చుపెట్టినను - ఎన్ని లక్షలువ్యయముచేసినను - పర్యాయపదనిఘంటువులీ వఱకాంధ్ర మండలమున వెలువడి యుండలేదు గదా!

ఇప్పట్టున మన మాతృభాషకును మనదేశభాషకును పర్యాయపద నిఘంటువులేని లోప ముందీర్చి "నిత్యకళ్యాణముఁ, బచ్చతోరణమునై జనులందఱునుల్లసిల్లఁగన్" (విజయవిలాసము) అనురీతిని భాషాచక్షుల రెంటినొసంగి పున్నెము గట్టుకొనన వారలుమీరలేగదా! మీరు కృత కృత్యులును సుకృతులునునైరి. నేఁడుగదా ఆంధ్రమాతగర్భము ఫలించినది. మీకృషిపున్నమ చంద్రుని పగిది చిరస్థాయి యగుఁగాక!!!

## మహారాజశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు,

### రాజమహేంద్రవరము. (29_4_1938).

మహారాజశ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారు విరచించుచున్న "యాంధ్రవాచస్పత్యము" ను మహానిఘంటువును నేను చదివించుకొని వినుచున్నాను.

ఇది 'యాంధ్రవాచస్పత్యము'ను పేరేగాని 'సంస్కృత వాచస్పత్య' మనిగూడ చెప్పవచ్చును. ఆంధ్ర గీర్వాణ భాషలయందుఁగల శబ్దజాలము చాలవఱకు నిఘంటువున నర్థములతోను ఉదాహరణములతోను పర్యాయపదములతోను మఱియెన్నియో విశేషాంశంబులతోను వివరింపఁబడియున్నది.

ఆంధ్రసారస్వతమునకీ గ్రంథము మహోపకారకమని చెప్పుటకే సందేహమునులేదు. వీరిప్రయత్నము మిక్కిలి శ్లాఘాపాత్రమైనది. చిరశ్రమైక సాధ్యమైన యీగ్రంథమునకు ఆంధ్రమహాజనులు తగు ప్రోత్సాహమిచ్చి యాదరింతురుగాక!

## మహారాజశ్రీ వాడ్రేవు శేషగిరిరాయకవిగారు, మేనేజరు హిందూ ఎయిడెడ్ గరల్సుస్కూలు, మడికి, చోప్పెల్ల. రామచంద్రపురం తా॥ (20-4-1938)

బ్రహ్మశ్రీ ఆంధ్రవిద్యావాచస్పతి కొట్ర శ్యామలకామశాస్త్రి మహాశయులకు సానమస్కారపూర్వకముగా నర్పించిన యభినందనపద్యములు.

శా. తూచాతప్పక నాంధ్ర సంస్కృతపదా ♦ స్తోకంపు సద్వార్థముల్
పాచీనాథుని కాద్యశేష కవితా ♦ భావానుమోదంబుగా
వాచస్పత్యము నానిఘంటునొనరిం ♦ పన్ జన్మసాఫల్యమై
యాచంద్రార్కము నంతమొందని యశం ♦ బార్జించితో!చాలదే !!

క. కరపంగలదీకోశము
కలపంగల దఖిలశాస్త్ర ♦ గ్రంథార్థములన్
కరపంకజ సంశోభన
కరమై కవిలోకకల్ప ♦ కమునై చెలఁగున్.

ఉ. ఈమహనీయ కోశమటు ♦ లేమహనీయుఁడు కూర్పఁగల్గె "ము
న్నీమహిరెండుబాసలకు ♦ నేనె సమర్థుఁడ !" నంచుఁగూర్చితో
శ్యామలకామశాస్త్రి ! నిను ♦ సంభవ మొందిన యాంధ్రమాతయుం
బ్రేముడిఁగన్నమాతయును ♦ బెంచిన మాతయు నెంతధన్యలో ! !

---

## మహారాజ శ్రీ, కవిశేఖర, భోగరాజు నారాయణమూర్తి పంతులుగారు. టీచరు. యమ్, ఆర్, కాలేజీ; సంస్థానకవులు. విజయనగరము.

విద్వదవతంసమా !

తమ యాంధ్రవాచస్పత్యము నన్నద్భుతానంద పరవశుంజేసినది. భాషాపోషకులు, వదాన్యశేఖరులునగు మహారాజులు వేలకొలఁదివెచ్చించుచుండఁగొందఱు విద్వాంసులు సంవత్సరములకొలఁదిఁబనిసేయుచుఁగొనసాగింపవలసిన యీమహాత్కార్యమును, 'ధనుర్విద్యకర్జునునింబోలు సాహిత్యవిద్య కసహాయశూరులై నిర్వహింపంబూనిన మిమ్మాంధ్రదేశము వేనోళ్ళ శ్లాఘించుచున్నది. తమకోశము కేవలము కోశమాత్రమ్మగాక, విజ్ఞానసర్వస్వము తెలుంగున వివిధవిషయ వివరణవిజ్ఞాన విపులంబై, భాషకుఁజిరకాలమునుండియుఁ దొలంగనికొఱంత నచిరకాలముననె తొలఁగించినది. మీమహోద్యమము నిర్విఘ్నముగఁగొనసాగుఁగాక !

ఉ॥ ఈమహనీయకోశము న ♦ హీనపరిశ్రమ కోర్చి కూర్చియా
సోమ దివాకరంబగు య ♦ శోవిభవంబును గొంటివెన్నియో
నోములు నోచిగాంచిన త ♦ నూజుఁడవై తివి తెన్గుమాతకో
శ్యామల కామశాస్త్రి బుధ ♦ సత్తమ ! నీకుఁజిరాయురున్నతుల్.

# శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ కొట్రి శ్యామల కామశాస్త్రిగారికి.

## నమస్కారములు.

ఆర్యవర్యా,

తమచేరచింపఁబడిన "ఆంధ్రవాచస్పత్యము" నేఁటివఱకు ప్రచురింపఁబడిన మూఁడుసంపుటములను చూచితిమి. చాల ఆనందము కలిగినది. ఇందనుక శబ్దరత్నాకరమొక్కటియే తెనుఁగుభాషకు ముఖ్యముగ శరణ్యమైయుండెను. సూర్యారాయ నిఘంటువొక్కటి బయలుదేరెనని వింటిమికాని, నేఁటికిని కాంచుభాగ్యమబ్బదయ్యెను. విజ్ఞానసర్వస్వమును వ్రాయఁగంకణము కట్టుకొనెడి విపశ్చిద్వరేణ్యులకు—మీ ఆంధ్రవాచస్పత్యము కుడిభుజము కాఁగలదు. ప్రకృతులకు వికృతులు కూర్పఁబడినవి. పర్యాయపదములీయఁబడినవి. లోకోక్తులు-న్యాయములును చేర్పఁబడినవి. ఇవియవియననేల ? ఈ వఱకు నిఘంటువులలో లేనియంశము లెన్నెన్నియో యిందున్నవి. పుణ్యక్షేత్రాదుల నామములనుగూర్చి వ్రాసినట్లే—చారిత్రకముగాఁబ్రసిద్ధికెక్కిన ముఖ్యనగరరాజముల పేళ్లనైనను చేర్చిన ఇంకను బాగుండెడిది. ఉదా:—కలకత్తా (కాళీఘట్టము). తరువాత అన్యదేశీయములైనను-మహ్మదీయ స్త్రీయనెడి అర్థమిచ్చు-బీబీ-బాబు. ఇట్టి శబ్దములనుకూడ కూర్చుదురుఁగాక. ఇకార్యము అనుబంధమున జరిగినను జరుగవచ్చును. ఏమైనను ఆంధ్రవిద్యావాచస్పతీత్యాదిబిరుదాంకితులగుమీచేరచింపఁబడిన ఆంధ్రవాచస్పత్యము సాహిత్యమును సంపాదించుకొను విద్యార్థులపాలి కామధేనువై—కవీశ్వరులపాలి కల్పవృక్షమై ప్రకాశించుననుటలో నతిశయోక్తి లేశమయినను లేదు. ఇట్టి గ్రంథరాజముల రచింపను ప్రకటింపను పరమేశ్వరుండు మీకు చిరాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించుఁగాక.—

ఇట్లు, బుధజనవిధేయులు.

1. N. Virabhadraswamy, బి. ఏ., యల్. టి.-హెడ్మాస్టరు—మ్యూనిసిపల్ హైస్కూలు, విజయనగరము. ది 16—6—38 సం॥

2. న్యాసావఝ్ఝల సత్యనారాయణమూర్తి.
మ్యూనిసిపల్ హైస్కూలు తెనుఁగుపండితుఁడు అనకాపల్లి.

# శ్రీ ఆంధ్ర వాచస్పత్యము.

## మకారాంతము వఱకు పదముల పట్టిక.

| ఆరంభాక్షరము — అంత్యాక్షరము | శబ్దరత్నాకరము 25344 | | ఆంధ్ర వాచస్పత్యము 52, 326, | | | | | | | | లక్ష్మీనారాయణీయం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం | తె | సం | తె | అం | పా | జా | ఆంగ్ల పరిభాష | వాడుక | లోకోక్తులు | అచ్చ తెనుఁగు పదములు |
| 'అ' మొదలు 'ణ' వఱకు | 5670 | 6740 | 13445 | 11838 | 1194 | 1908 | 143 | 295 | 603 | 67 | 11317 |
| త | 452 | 1324 | 779 | 2143 | 191 | 71 | 45 | — | 174 | 9 | 2093 |
| థ | — | — | 4 | — | — | — | — | — | — | — | — |
| ద, ధ | 708 | 622 | 1046 | 938 | 349 | 26 | 4 | — | 128 | 4 | 900 |
| న | 767 | 986 | 885 | 1395 | 206 | 35 | 18 | — | 189 | 3 | 1394 |
| ప, ఫ | 1751 | 2356 | 2292 | 3281 | 372 | 75 | 48 | — | 808 | 11 | 3262 |
| బ, భ | 651 | 869 | 1033 | 1384 | 175 | 15 | 8 | — | 424 | 5 | 1332 |
| మ | 706 | 1742 | 1243 | 2512 | 242 | 40 | 34 | — | 186 | 3 | 2500 |
| మొత్తము | 10705 | 14639 | 20727 | 23491 | 2729 | 2170 | 300 | 295 | 2512 | 102 | 22798 |




# త

త. ఒకయక్షరము. సం.వి. అ. పుం. 1. అంటుట: చూ, సంయోగము; 2. నిశ్చయము: చూ, సత్యము; 3. కోపము: చూ, రోషము; 4. తోఁక, పందితోఁక (అనికొందఱు): చూ, వాలము. 1; 5. పరస్పరవిరోధమును గలుగఁజేయు మాట: చూ, శబ్దము. 2; 6. దొంగ: చూ, మ్రుచ్చు. 1; పుం. న. 7. ఆడుట; విణ. 8. ఆడించేవాఁడు; 9. ప్రస్తుతప్రయోజనపుమాట: చూ, శబ్దము. 2; 10. కారణము:చూ, హేతువు.1; 11.లక్ష్మీముఖము; అం. 12. దంత్యములలో నొకటి: చూ, దంత్యములు; 13. పరుషములలో నొకటి: చూ, పరుషములు.

తంకర. దే. వి. తుచ్ఛధాన్యము: చూ,ధాన్యము.

తంగు. దే. వి: చూ, రూ-టంగు.

తంగువాఱు. దే. వి: చూ, రూ-టంగువాఱు.

తంగెడు. దే. వి. రూ-తంగేడు*: చూ, హేమపుష్పకము.

తంగేటిజొన్ను. జా. సులభముగా లభించునది. "అచపర్గ కాంతుచేనాకొన్నవానికిఁదంగేటి జొన్నుశ్రీరంగశాయి." కవికర్ణరసాయనము

తంగేడు. దే. వి: చూ, రూ-తంగెడు *.

తంట. దే. వి. రూ-తంటా. 1. అప్పు: చూ, బాకి. 2; 2. మోసము: చూ, వంచన; 3. అతలకుతలము:చూ, శ్రమము. 1; 4. కలహము: చూ, యుద్ధము; 5: కొండియము-రూ-కొండెము. చాడి-రూ-చాడీ.

తంటలమారి. దే. విణ. రూ-తంటాలమారి. కలహకారి: చూ, సూచకుఁడు. 1.

తంటసము. వా. వి. 1: చూ, తండసము. (1); 2: చూ, తండసము. (2).

తంటా. దే. వి: చూ, రూ-తంట.

తంట్రియము. దే. వి. రూ-తంటెము *: చూ, పుష్పపుహ్నాటము. (దీని ఆకులలోను విత్తులలోను 'కైసోఫానిక్ ఆసిడ్' గలదు. ఇది తామరకు సిద్ధౌషధము.)

తంటెము. దే. వి. —పై.—

తండకము. సం. వి. అ. పుం. 1. = దంతియ. ఇంటిదూలము:చూ, మదనచేతులు; 2.కాటుకపిట్ట: చూ, పిచ్చుక; 3. నురుగు: చూ, ఫేనము; 4. కాలికివేసికొనెడునగ : చూ, భూషణము. 2.

తండము. సం. వి. అ. పుం. = తండా. లంబాడీల గుంపు: చూ, సమూహము.

తండసము. సం. వి. అ పుం. 1.కమ్మరకొలిమి: చూ, రంధ్రము. 1; దే. వి. (1) మంగలి వెండ్రుకల నూడఁబెఱికెడి పసిముట్టు: కుటిలిక, తంటసము; వా. (2) జెరిమానా, తంటసము.

తండా. నై. వి. 1.= తండ. లంబాడీల గుంపు: చూ, సమూహము; 2. సరకునింపిన గోనెల సమూహము.

తంఢిరి. దే. వి. రూ- తండ్రి:చూ,పితరుఁడు.1.

తండు. దే. స. క్రి. ఇయ్యవలసినధనమును పోయియడుగు. (తండుకొనుఅనియు)

తండుగోల. దే. వి. (తండు + కోల) చేఁపలఁ బొడిచెడు చిల్లకోల, మండము. పంచ. వేం. 1, ఆ. 614: చూ, సర్వల.

తండురీణము. సం. వి. అ. పుం. 1. కడుగు నీరు: చూ, శుక్తము. 1; 2. కీటకము:చూ, పురుగు; 3. బొబ్బరలు: చూ, ధాన్యము.

తండులకాలింగనము. అం. ఆలింగనములు పదునాలుగింటిలో నొకటి:చూ, ఆలింగనములు.

తండులఫల. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి *:చూ, శొంఠి.

తండులము. సం. వి. అ. పుం.1: చూ, బియ్యము; 2: చూ, వాయువిడంగము*. (ఇట్లు తండు లీయిక- తండులుపు.)

తండులాంబువు. సం. వి. ఉ. న. పులికడుగు: చూ, శుక్తము. 1. [ఖండీరము.

తండులి. సం. వి. ఈ. స్త్రీ. చిట్టి *: చూ,

తండులీకము. సం. వి. అ. పుం. —పై.—

తండులీయకము. సం. వి. అ. పుం. —పై.—

తండులీయము. సం. వి. అ. పుం.1.—పై.—; 2. ఒకానొక ధాన్యము: చూ, ధాన్యము; 3: చూ, వాయువిడంగము*.

తండులేరము. సం. వి. అ.పుం: చూ, తండులి*.

తండులోత్థము. సం. వి. అ. న: చూ, తండు లాంబువు.

తండులోదకము. సం. వి. అ. న.—పై.—

తండువు. సం. వి. ఉ. పుం, ఊ. స్త్రీ. 1.= తెడ్డు-తెడ్డు. రూ-తండువు-తర్దువు. హస్తా కారమైన దారువు: చూ, దర్వి. 1. (చూ, పాత్రము. 6.) ; 2.= తెడ్డు-తెడ్డు. రూ- తందువు-తద్దు-తడ్డు-తడ్డువు-తర్దువు. నావ నడపు తెడ్డు: చూ, పీలి. 2; ఉ. పుం. 3. నందీశ్వరుఁడు(శ.ర.) (తుండిఅనిఅమరము): చూ, వృషభము. 1.

తండేలు. దే. వి. రూ-తండేలు: చూ, సరంగు.

తండేలు. దే. వి.—పై.—

తండోపతండము. మి. వి. 1: అహమహమిక, అహంపూర్విక; వా. వి. బ. 2. గుంపులు గుంపులు. "తప్పులెన్నువారు తండోపతండంబులు" వేమన శతకము.

తండ్రి. దే. వి, 1: చూ, పితరుఁడు. 1; అం. 2. స్త్రీరక్షకు లాలుగురిలో నొకఁడు:చూ, స్త్రీరక్షకులు; 3. గయాపిండ దానార్హులలో నొకఁడు: చూ, గయాపిండదానార్హులు.

తండ్రికి పూర్ణాయుర్దాయమునిచ్చు జాతకుఁడు.- పా. (ఎ) నవమాధిపతి స్వక్షేత్రమందున్నను, ఉచ్చయందున్నను, పాపగ్రహసంబంధము లేక శుభగ్రహ సంబంధమున్న పుడును, (బి) పితృస్థానమందు శుభులుండి పాపగ్రహ సంబంధము లేకుండినను, (సి) పితృస్థానము కర్కటకమయి యచ్చోట గురునకు పాపగ్రహసంబంధము లేకుండినను, (డి) పితృస్థానాధిపతి పాపసంబంధములేక శుభసంబంధియైనను, (ఇ) పితృస్థానము శుభగ్రహమధ్యస్థమయి యుండునపుడును, (ఎఫ్) పాపసంబంధములేక పితృస్థానమందు శుభులుచ్చస్థులై యుండునపుడును, (జి) నవమాధిపతి పరమోచ్చ స్థానమందుండి గురునితోఁ గలసినను, లగ్నమునకుఁ గేంద్రములయందు శుక్రుఁడున్నను తండ్రికి దీర్ఘాయుర్దాయము గలుగును. [హుఁడు. 1.

తండ్రితండ్రి. దే. వి. తాత. చూ, పితామ

తండ్రినిగర్భములోనుండునపుడుచేంపెడి(శిశువు) జాతకుఁడు. పా. (ఎ) సూర్యుఁడు 6—8—12 స్థానములలోనుండి, అష్టమాధిపతి నవమమునందుండి, వ్యయాధిపతిలగ్నమునందుండిషష్ఠమాధిపతి పంచమమున నుండునపుడును, (బి) దివమందు జననమై, రవి పాపులతో సంబంధించి, రవికిఁబంచమ నవమముల యందుఁ బాపగ్రహములుండి, జననకాలము నను వీరిలో నెవరిదయిన దశవచ్చినపుడును, (సి) రాత్రి జననమై, శనిపాపులతో సంబంధించి యట్టిశనికి బంచమనవమములయందుఁ బాపగ్రహములుండి, వీరలలో నెవరిదయిన దశజననకాలమునకు వచ్చినపుడును శిశువు గర్భములోనుండఁగ తండ్రి చనిపోవును.

తండ్రిని బాల్యమందుఁజంపెడి జాతకుఁడు. పా. (ఎ) రవిశనులుగూడి 12 వ స్థానమందుండి. క్షీణచంద్రుఁడు సప్తమస్థానమునందుండి,

శుభగ్రహసంబంధములేక జననకాలమునకు వీరిలో నెవరిదళయైన వచ్చినయెడలను, (బి) ద్వాదశమున శనిరాహువులుండి, క్షీణ చంద్రుఁడు సప్తమమునసుండి, శుభగ్రహ సంబంధము లేనియెడలను, (సి) రవిపాపుల తోఁగలసి, 9వ స్థానమందుండి, జననకాలము నకు వీని మహాదశవచ్చినయెడలను, (డి) రవి కుజశనులు, లగ్నపంచమ నవమ ద్వాదశ ములలో నెచ్చటనైనసుండి, శుభగ్రహసంబం ధములేక వీరిలో నెవరిదైన మహాదశ జనన కాలమునకు వచ్చినయెడలను,(ఇ)నవమమందు రాహువుగాని, కేతువుగాని యుండి జనన కాలమునకు వీరి దశవచ్చిన యెడలను, (ఎఫ్) పితృస్థానాధిపతియున్న రాశ్యధిపతి పితృస్థాన మందుండి రవి రాహువుతోఁ గలిసి శుభసంబంధములేక జననకాలమునకు వీరి దశవచ్చినయెడలను, (జి) నవమాధిపతి రాహువుతో గలిసి, నవమమందుండి, జనన కాలమునకు నీరాహుదశ వచ్చినయెడలను (హెచ్) పితృస్థానాధిపతి రవితోగాని రాహువుతోగాని కలిసి అష్టమాధిపతి సం బంధముండి, శుభసంబంధములేక జననకాల మునకు వీరిదశవచ్చిన యెడలను (ఐ) పితృ స్థానాధిపతికి రవిరాహువులు అష్టమ మం దుండి శుభసంబంధము లేనపుడును, (జే) పితృస్థానాధిపతికిని రాహువునకును షష్టా ష్టమముగలిగి, వీరిలో నెవరిదైన దశవచ్చినపు డును, (కే) ఏగ్రహములయిన పితృస్థాన మందుచ్చ యందుండి, రాహువుతో గలిసి వీరిదశవచ్చియుండిన యెడలను,(ఎల్)నవమ మందు పాపులు శుభసంబంధములేకయుండి, వీరిదశ వచ్చియుండునపుడును, (ఎమ్) సిం హమందు రాహువుగాని, కేతువుగాని యుండి, పాపగ్రహములతోఁగూడి, వీరిదశ వచ్చినపుడును, (ఎన్) జననకాలమునకు రాహుమహాదశవచ్చి యీరాహువు పితృ స్థానాధిపతితోఁగూడి, శుభగ్రహ సంబం ధము లేనపుడును బాల్యమున తండ్రి చేసి పోవును.

తంతి. నై. వి. 1=తంత్రీ. తీఁగియ: చూ, సూ త్రము. 1; 2. వీణె మొదలగు వానికి వేసెడు ఉక్కు కమ్మి: చూ, సారణి. 3; వా. వి. 3. వార్తలనందించెడి ఉక్కుతీఁగె, తంతువు.

తంతియ. దే. వి. రూ-తంతె. మెట్టు: చూ, సోపా నము. (బ. తంతియలు=మెట్లు.)

తంతీపు. దే. వి: చూ, సంభ్రమము. ఆం, భా. ప్ర. 140. (తరితీపు అని కొందఱు)

తంతు. నై. వి. 1. = తంత్ర. క్షుద్రదేవత కొలువు. (దేశ్యమని శ. ర.): చూ, పండు గ. 2; 2.=తంత్రమ్. ఉభయార్థసాధకమైన ఉపాయము: చిట్టె. (సం.ప.).—తంత్రము; 3. వివాహాదులలోఁజేయు కార్యవిశేషము.

తంతుకాష్ఠము. సం. వి. అ. న. 1. సాలెవాని నాడె: చూ, నాడె; 2. నూలు వడికెడు కదురు: చూ, తర్కు-వు. [చూ, పురుగు.

తంతుకీటము. సం. వి. అ. పుం. పట్టు పురుగు:

తంతునాగము. సం. వి. అ. పుం. నెగడు: చూ, మత్స్యము. 1. [పురుగు.

తంతునాభము. సం. వి. అ. పుం: చూ, సాలె

తంతుభము. సం. వి. అ. పుం. ఆవాలు: చూ, సర్షపము. [పురుగు.

తంతువాయము. సం. వి. అ. పుం: చూ, సాలె

తంతువాయుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, సాలెవాఁడు; ఆం. 2: చూ, జాతులు.

తంతువు. సం. వి. ఉ. పుం. 1. నూలిపోఁగు: చూ, నూత్రము. 1; 2:చూ,తంతునాగము; 3: చూ, తంతి. 2; 4: చూ, తంతి. 3.

తంతుస్నేహము. సం. వి. అ. పుం: చూ, తంతు భము.

తంతె. దే. వి: చూ, రూ- తంతియ.

తంత్రికము. సం. విణ. క్రొత్తది (బట్ట): చూ, వస్త్రము.

తంత్రభేదము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

తంత్రము. సం. వి. అ. న. 1: చూ, తంతు.2; 2. స్వరాష్ట్రచింత. (చూ, ఆవాపము. 4); 3. వ్యాకరణ శాస్త్రము: చూ, శాస్త్రములు; 4. కుటుంబవ్యాపారము; 5. ఉత్తమమైన ఔషధము: చూ, మందు. 1; 6.నవవిధజ్యోతిషగ్రంథములు: చూ,సిద్ధాంతము.2. (చూ, జ్యోతిషము.); 7. ప్రధానము: చూ, శ్రైష్ఠ్యము; 8. నూలుపడుగు: చూ, మగ్గము; 9. పరిజనము:చూ, పరివారము.1; 10.ఒకానొక వేదశాఖ: చూ, వేదము; 11. కారణము:చూ, హేతువు.1;12. ఇట్లు చేయఁదగినదనుట; 13. ఒకపదమునకు రెండర్థములు గలిగియుండుట; 14.=తంతు. క్షుద్రదేవతారాధనము: చూ, పండుగ. 2; 15. ఆగమములు ఇరువదెనిమిదింటిలో నొకటి: చూ, ఆగమములు. (చూ, ఉపవిద్యలు)

తంత్రములు. అం. 1. మిత్రలాభము, మిత్రభేదము, సంధివిగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము. (5); 2. అవ్యాజపాలిన్యాది.— అవ్యాజపాలినీ, రాజ్యలక్ష్మీ ప్రసాదక, సర్వసామ్రాజ్య, అంగారగమన, రాజ్యపాలన, స్త్రీబాలరాజ, చామరద్వంద్వ, ప్రహర్ష రాజ, ధీర, గ్రామపాలన,మిత్రలక్ష్మీప్రయోగ, దుర్గపాలన, ప్రాణలక్ష్మీప్రయోగ,ప్రభాలక్ష్మీప్రయోగ, తోయలక్ష్మీప్రయోగ,గంధలక్ష్మీప్రయోగ, పుష్పలక్ష్మీప్రయోగ,కామరూప, కళాజీవనిక, కుంజకంబళ, కనకప్రయోగ, బోధనీ, సత్యలక్ష్మీప్రయోగ,పాదుక, ప్రజ్ఞాలక్ష్మీప్రయోగ,ఖేటక,చాపలేప, శల్య,భీమలక్ష్మీప్రయోగ, మణిస్థానప్రయోగ, పాతాళగమన, మర్దిని, స్ఫులింగలక్ష్మీ, శంఖమర్దళ, చక్రాయుధప్రయోగ, భైరవాది ప్రయోగ, సూపతంత్ర, లేఖతంత్ర, పృథివి, అశ్వ, గజ, గోరక్ష, ఐశ్వర్యలక్ష్మీ, కుల్య, మిత్రలక్ష్మీప్రయోగ, జీవని, గిరి, వన, స్థానాపత్యప్రయోగ, శ్రీసర్పదంశిని, విషచ్ఛేద, గరళ, శ్వాంగకాద్యప్రయోగ, నరవాహన, స్తంభిని, దాహిని, మారిణి, ద్వేషిణి, మృతసంజీవని, ఉచ్చాటన, శోషణి, ఆకర్షణ, హా, మేఖళికా తంత్రములు (60); 3. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములు.— మహామాయాశంబరము, యోగినీ జాలశంబరము, తత్త్వశంబరము, సిద్ధభైరవ తంత్రము, కాలాగ్నిభైరవ తంత్రము, అగ్నిభైరవ తంత్రము, శక్తిభైరవ తంత్రము, యోగినీ భైరవ తంత్రము, మహాభైరవ తంత్రము, ప్రధానభైరవ తంత్రము, బ్రాహ్మీతంత్రము, మహేశ్వరీ తంత్రము, కౌమారీ తంత్రము, వైష్ణవీ తంత్రము, వారాహీ తంత్రము, ఇంద్రాణీ తంత్రము, చాముండా తంత్రము, శివదూతీ తంత్రము, యమళాష్టక తంత్రము, చంద్రజ్ఞాన తంత్రము, మాలినీవిద్య, మహాసమ్మోహనము, వామజుష్ట తంత్రము, మహాదేవ తంత్రము, వాతూలము, వాతూలోత్తరము, కామికము, హృద్భేద తంత్రము, తంత్రభేదము, గుహ్యతంత్రము, కలావాదము, వాచ్యాయ నాదికము, కళాసారము, కుండికామతము, మతోత్తమము, వీణాఖ్యము, త్రోతలము, త్రోతలోత్తరము, పంచామృతము, రూపభేదము, భూతోడ్డామరము, కులసారము, కులోడ్డీశము, కులచూడామణి, సర్వజ్ఞానోత్తమము, మహాకాళీ మతము, అరుణేశము, మోదినీశము, వికుంఠేశ్వరము,

పూర్వము, పశ్చిమము, దక్షిణము, ఉత్తరము, నిరుత్తరము, విమలము, విమలోద్భవము, దేవీమతము, శుభాగమపంచకము, వశిష్ఠసంహిత, సనకసంహిత, శుకసంహిత, సనందనసంహిత, సనత్కుమారసంహిత (మహావిద్యలు 18 యును ఉపవిద్యలు 46 ను గూడిచతుష్షష్టివిద్యలయ్యె.స.సార.సం75పొ.

తంత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1.=తంతి. లోహపు తీఁగె: చూ, సారణి. 3; 2. తిప్పతీఁగె*: చూ, సోమవల్లి; 3. నాడి: చూ, నరము.(1)

తంత్రిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, తంత్రి. 2.

తంత్వాతర్చనము. సం. వి. అ. న. ఆసుగోవి: చూ, మగ్గము.

తండనము. వై. వి.=తానః. మాటిమాటికి తాన శబ్దపూర్వకముగా చేసెడు రాగాలాపము. కళా. 3, ఆ. 197: చూ, స్వరము. 2.

తందర. వై. వి.=తంద్రి. 1. తూఁగు, కునికిపాటు: చూ, ప్రమీల; 2. నిద్దుర: చూ, స్వప్నము. 2. [లోదకము.

తందరీణము. సం. వి. అ. పుం: చూ, తండు

తందువు. సం. వి. ఉ. పుం: చూ, రూ-తండువు. [తండురీణము.

తండూరీణము. సం. వి. అ. పుం: చూ, రూ-

తంద్రి. సం. వి. ఆ. స్త్రీ=తందర. చూ, తందర.

తంద్రి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

తంద్రిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

తంపటి. వా. వి. కుండలో తేగలులోనగు వానినినుంచిబోరగిలఁబెట్టిగడ్డిలోనగువానిచేతనుడికించుట.

తంపటిదోసకాయ. జా. క్రమవిరుద్ధముగా తయారైనది. [పద్మము. 1.

తంపర. దే. వి. తామరగుంపు, షండము: చూ,

తంపి. దే. వి. రూ-త్రింపి. 1. దాలిగుంట: చూ, రంధ్రము. 1; 2. కయ్యము: చూ, యుద్ధము.

తంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవు: చూ, ధేనువు; దే. వి. (1) తంబతీఁగె*: చూ, శింబి.

తంబళి. దే. వి. రూ-తంబళి-తంబన-తమ్మళి-తంబిగ. 1. శివార్చనచేసి బ్రదికెడు జాతి. (తంబళివాఁడు, తంబళిది); 2. అర్చకుఁడు: చూ, పూజారి; 3. శివార్చకుఁడు: చూ, పూజారి; 4. విష్ణ్వర్చకుఁడు: చూ, పూజారి.

తంబళి. దే. వి.—పై.—

తంబిగ. దే. వి.—పై.—

తంబు. దే.వి.రూ-తమ్ముఁడు: చూ, సహోదరుఁడు. (ఇది వాత్సల్య సంబోధనమునందు వాడఁబడును.)

తంబుగ. దే. వి. మెడ నిడుపుగా నుండెడు చెంబు: చూ, పాత్రము. 6.

తంబుర. వై. వి.=తుంబురు. రూ-తంబురా-తంబుఱ-తంబుఱా. ఉ, రా. 6, ఆ. 116: చూ, వీణె.

తంబురా. వై. వి.=—పై.—

తంబుఱ. వై. వి.=—పై.— (తంతి + బుఱ్ఱ) (ద్వయమని శబ్దరత్నాకరము) ఉ, రా. 6, ఆ. 116. (వైకృతమనికొండఱు)

తంబుఱా. వై. వి.=—పై.—

తక. పా: చూ, కిట.

తకతక. దే. వి. తాళమునందగు ధ్వన్యనుకరణము: చూ, హహాహహా.

తకపికలాడు. దే. అ. క్రి. (తకపికలు + ఆడు) ఇట్టట్టుచలించు. శశాం. 4, ఆ. 61: చూ, సళించు.

తకపికలుసేయుట. జా. ఎచ్చుతగ్గులు సేయుట. "మకరాంకుని యనుఁగు మేనమామకు నీకుం దకపికలు సేయవలదనుము." విజ. 2, ఆ. 196.

తకరరు. వా. వి: చూ, రూ-తకరారు.

తకరారు. వా. వి. 1. భేదము; 2. వివాదము.

తకాలి. హిం. వి. సేద్యము చేయుటకై సహాయముగా నియ్యఁబడెడు సొమ్ము.

తక్క. దే. అవ్య. కాక: చూ, వినా.

తక్కటి. దే. వి. మూఁడు ముఖములుగల దీపారాత్రికపు తట్ట.

తక్కడ. వై. వి. 1.=తర్కారి. రూ-తక్కిడ-తక్కెడ. కూరనెల్లి*: చూ, శ్రీపర్ణము. 1; వై. వా. వి. 2.=త్ర్యంకటమ్. (పేముతట్టలు వ్రేలవేసిన) తక్కెడ- రూ-తక్కిడ-తక్కిడి-తక్కెడ: చూ, త్రాసు.

తక్కరి. వై. వి. 1.=తర్కారి*: చూ, వైజయంతి.4; వై. విణ. రూ-టక్కరి. (తక్కు+అరి) 2. మోసకాఁడు. జై. 8, ఆ. 111: చూ, వంచకుఁడు; 3. వంచకురాలు: చూ, స్త్రీ.

తక్కలి. వై. వి.=: చూ, రూ-తక్కరి. 1. *.

తక్కారి. వై. వి.=:—పై.—

తక్కాలి. వై. వి.=:—పై.—

తక్కిడ. వై. వి: చూ, రూ-తక్కడ. 1—2.

తక్కిడి. వై. వి. 1.=తస్కర. మోసము: చూ, వంచన; 2.=తర్కారి. జయంతి*: చూ, వైజయంతి. 4; 3: చూ, రూ-తక్కడ. 2.

తక్కిడికాఁడు. వై. విణ. మోసకాఁడు. అచ్చ. సుం, కాం. 47: చూ, వంచకుఁడు. 1.

తక్కిల. వై. వి.=తర్కారీ*: చూ, వైజయంతి.4.

తక్కిలి. వై. వి.=—పై.—

తక్కు. వై. వి.=తక్క. రూ-టక్కు. 1. మోసము: చూ, వంచన; 2. అసత్యము: చూ, వితథము; 3. న్యూనము: చూ, వెలితి. 2; దే. వి. 4. మిగులు. భార. సౌ. 2, ఆ. 80: చూ, శేషము. 1; దే. విణ. 5. ఇతరము: చూ. పరాయి; దే. అ. క్రి. 6. తప్పు. భార. సౌ. 2, ఆ. 100: చూ, మిడివోవు; దే. స. క్రి. 7. విడుచు. భార. భీష్మ. 3, ఆ. 306: చూ, విసర్జించు; వై. అ. క్రి. 8. టక్కుచేయు: చూ, వంచించు.

తక్కుడు. దే. వి. తక్కుట. నిర్వ. 4, ఆ. 66.

తక్కులాఁడి. ద్వ. విణ. (తక్కులు + ఆఁడి): చూ, రూ-టక్కులాఁడి.

తక్కులాఁడు. ద్వ. విణ. (తక్కులు + ఆఁడు): చూ, రూ-టక్కులాఁడు.

తక్కువ. దే. వి. కొఱఁత: చూ, వెలితి. 2.

తక్కువపడు. ద్వ. అ. క్రి: చూ, లోపించు.2.

తక్కువపఱచుట. దే. వి: అధఃకరణము, అధఃకారము.

తక్కువపాటు. ద్వ. వి. 1. కొఱఁతపాటు. భార. అర. 6, ఆ. 17: చూ, లోపము. 2; 2. న్యూనము: చూ, వెలితి. 2.

తక్కె. దే. వి.1. రెండువీసెలయెత్తు. రూ-తక్కెడు, ఎత్తు, ఎత్తెడు, రెండువీసెలు; వై. వి. 2.=తర్కారి*: చూ, వైజయంతి. 4.

తక్కెడ. వై. వి. 1.=తర్కారీ. తక్కిలి, తక్కోలకము.*: చూ, వైజయంతి. 4; 2.=తర్కారీ. కూరనెల్లి*: చూ, శ్రీపర్ణము. 1; 3.=త్ర్యంకటము: చూ, తక్కడ. 2.

తక్కెడు. దే. వి.=: చూ, రూ-తక్కె. 1.

తక్కెఱ. దే. విణ. అల్పము: చూ, స్వల్పము.

తక్కెల. వై. వి.=: చూ, రూ-తక్కెడ. 1.

తక్కేడ. వై. వి.=—పై.—

తక్కేల. వై. వి.=:—పై.—

తక్కొను. దే. అ. క్రి: చూ, యత్నించు. భార. ఆది. 4, ఆ. 79.

తక్కోలకము. సం. వి. అ. న. రూ-కోలకము*. చూ, తక్కెడ. 1. (తక్కోలఫలమని కొందఱు.)

తక్కోలము. సం. వి. అ.న.:చూ, తక్కోలకము

తక్కోలబుట్లు. మి. వి: చూ, కటిఘము.

తక్తు. వా. వి. సింహాసనము: చూ, తప్తు.

తక్రము. సం. వి. అ. న. పాతికపాలు నీళ్లు చేర్చిన మజ్జిగ: చూ, మజ్జిగ.

తక్రాటము. సం. వి. అ. పుం. పెరుఁగుచిలికెడు కవ్వము: చూ, మంథానము.

తక్షకుఁడు. సం. వి. అ. పుం. 1. తక్షకుఁడను సర్పరాజు: చూ, సర్పము; 2. వడ్లవాఁడు. రూ-తక్షుఁడు-తక్షానుఁడు (కృశము గాఁజేయువాఁడు): చూ, స్వర్ణకారుఁడు.

తక్షణము. సం. వి. అ. న. 1. (మ్రాను) చెక్కుట; వా. వి. 2. జరుగుడు, వెంటనే: చూ, అకస్మాత్తు, డబ్బాటు.

తక్షిణి. సం. వి. ఈ. స్త్రీ. బాడిస:చూ, వాశి.

తక్షశిల. సం. వి. ఆ. స్త్రీ. తక్షశిలయను దేశము: చూ, దేశము. [కుఁడు. 2.

తక్షుఁడు. సం. వి. న్. పుం: చూ, రూ-తక్ష

తగటి. దే. విశ. (తగటు + ఇ) రూ-తగటీ. సరిగది: చూ, వస్త్రము.

తగటీ. దే. విశ.—పై.— [193: చూ, సరిగ.

తగటు. దే. వి. జలతారు. అచ్చ. బాల, కాం.

తగడు. దే. వి. బంగారు లోనగుకాని రేకు. పాండు. 3, అ. 202: చూ, సరిగ.

తగణము. పా. రెండుగురువులు ఒకలఘువు గలది. ఉదా.— శ్రీరామ (చూ, అష్టగణలక్షణము) [(చూ, ఉపగణములు.)

తగము. పా. త + గ. ఉదా.— విశ్వేశ్వరా.

తగరపాదికము. సం. వి. అ. న. తగరము: చూ, లోహము. 1.

తగరము. సం. వి. అ. పుం. 1.=తగరు. పొట్టేలు: చూ, మేషము. 1; 2. జిహ్మము*: చూ, నందివర్ధనము; నై. వి. (1).=తమలత్రిపుల. రూ-తవరము: చూ, లోహము. 1.

తగరు. నై. వి. 1.=తగర. పొట్టేలు: చూ, మేషము. 1; అం. 2. దిక్పాల వాహనములు ఎనిమిదింటిలో నొకటి: చూ, దిక్పాల వాహనములు.

తగరురవుతు. నై. వి.=తగర రాహుత్త. అగ్ని: చూ, వహ్ని. 1. (ఇట్లు తగర బాబాసామి)

తగవరి. దే. వి. (తగవు + అరి) రూ-తగువరి. న్యాయాధిపతి: చూ, స్వామి. 3.

తగవు. దే. వి. రూ-తగువు. 1. న్యాయము. భార. ఉద్యో. 2, ఆ. 64: చూ, సత్యము.1; 2. తగుటు; 3. ధనాది నిమిత్తమైన జగడము: చూ, యుద్ధము; 4. పెండ్లప్పుడు పెండ్లికూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహుమానము; విశ. 5. తగినది, యుక్తము. భార. స్త్రీ. 2, ఆ. 62: చూ, సమీచీనము. 1; వా. వి. 6.తగాదా. "తగవు తెచ్చినాఁడు."

తగవుగోరి. దే. విశ. (తగవు + కోరి) సంధిచేయువాఁడు: చూ, మధ్యస్థుఁడు.

తగాదా. వా. వి. 1. తగవు; 2. వ్యాజ్యము.

తగాయిదా. వా. వి.—పై.—

తగిరిస. దే. వి. తంటెము*:చూ, ప్రపున్నాటము.

తగు. దే. అ. క్రి. 1. ఒప్పు. ఆం, భా. తృ. 83: చూ, సమ్మతించు; 2. యుక్తమగు: చూ, సరిపడు. 2.

తగుకత్తి. ద్వ. వి. సాదనకు ఉపయుక్తమైన కత్తి: చూ, రిష్టి. 2.

తగులఁగట్టు. దే. స. క్రి. (తగులన్ + కట్టు) తగిలించు: చూ, తగులఁబెట్టు.

తగులఁబడు. ద్వ. అ. క్రి. (తగులన్ + పడు) తగులు, చిక్కు (స్వార్థమునపడు): చూ, లోఁబడు.

తగులఁబెట్టు. దే. స. క్రి. (తగులన్ + పెట్టు) 1: చూ, తగులఁగట్టు; 2. కాల్చు: చూ, దహించు.

తగులము, దే. వి. రూ-తగులు-తవులు-తౌలు 1. చొక్కు: చూ, వలపు. 2; 2. ఆసక్తి. భార. శిగా. 2, ఆ. 261: చూ, వాంఛ; 3. అడ్డపాటు: చూ, వారణము. 1.

తగులాటకత్తె. ద్వ. వి. (తగులాటము + కత్తె) తగులాటముగల ఆఁడుది: చూ, స్త్రీ.

తగులాటము. దే. వి. (తగులు + ఆట) తగులు: చూ, బంధము. 1. (ఇది పోరాటము మాటాటము వంటిది.)

తగులు. దే. వి. 1. రూ- తవులు-తౌలు.ఆస భార. ఆర. 2, ఆ. 62 : చూ, వాంఛ; 2. చొక్కు, అభిలాష: చూ, వలపు. 2; 3. పశువు మెడత్రాడు. ఆం, భా. ద్వి.231: చూ, మూత్రము. 1; 4.తగులాటము. కళా. 4, ఆ. 43: చూ, బంధము. 1; అ. క్రి 5. చిక్కు: చూ, లోఁబడు; 6. తాఁకు: చూ, స్పృశించు; 7. సక్తమగు: చూ, మేళగించు. 1; 8. అంటు: చూ, లంకించు. 1; 9. పొసఁగు: చూ, పొసగు; 10. పట్టు ఆయిల్లు కట్టుటకు శిర్చు ఏమితగిలెను." ,చూ,పట్టు;అం.ప్రే.11.తగులఁజేయు.కళా 3, ఆ. 197. తగులుచు-రూ- తగుల్చు-తవులుచు- తౌలుచు - తౌల్చు. (సం. ప.) క్రీలించు; స. క్రి. 12: చూ, వెంబడించు.

తగులుకొను. దే. అ. క్రి. 1. మంటరెత్తు. "ఆగుడిసె తగులుకొన్నది." : చూ, కాలు; స. క్రి. 2. కామించు, రూ- తవులుకొను- తౌలుకొను: చూ, సంభోగించు.

తగులుకోలు. దే. వి. తగులుకొనుట : చూ, లంకెపాటు.

తగులుగొండి. దే. విశే. (విటుని) తగులుకొను నట్టిది. (ఆఁడుది.): చూ, విటుకులాఁడి.

తగులుచు. దే. ప్రే: చూ, రూ-తగులు. 11.

తగులుడు. దే. వి. 1 : చూ, తగులుకోలు; 2. పెట్టుబడి: చూ, వ్యయము.

తగులుదల. దే. వి. —పై.—

తగులుబడి. దే. వి. —పై.—

తగులువడు. ద్వ. అ. క్రి. చిక్కు: చూ, లోఁ[బడు.

తగులువాటు. ద్వ. వి. తగులుపడుట.

తగువు. దే. వి: చూ, రూ- తగవు.

తగ్గించు. దే. స. క్రి: అతకరించు, తీసివేయు. ప్రే.— క్రిందుపఱచు. అ. క్రి.—అణుగు వడు, ఓసరిలు- రూ- ఓసరిల్లు- ఓసరు. తగ్గు, తఱుఁగు- రూ- తఱుగు. (మి. ప.).— అ.క్రి.— అల్పతనొందు.(సం.ప.)స.క్రి.— అధఃకరించు.

తగ్గింపు. దే. వి. చాక: చూ, వెల. 1.

తగ్గు. దే. వి. 1. తక్కువ. రూ- తగ్గువల: చూ, వెలితి. 2; అం. 2. త్రివర్గమునందొకటియగు క్షయము. (త్రివర్గములు.— క్షయ స్థాన వృద్ధులు.= తగ్గు నిల్కడ పెరుగుట): చూ, వర్గములు; దే. అ. క్రి. 3. తక్కువగు:చూ, సుక్కు. 4; 4. ఓసరిలు. ఆం, భా. తృ. 96: చూ, తగ్గించు; 5. వెనుకకుఁదీయు: చూ, వెనుకదీయు; 6. తెగిపడు. భార. విరా. 4, ఆ. 87.

తగ్గుదల. దే. వి: చూ, రూ- తగ్గు. 1.

తచ్చేన. దే. వి. 1. ఆట: చూ, పరిహాసము; 2. కపటము: చూ, వ్యాజము. 1.

తచ్చేనలాడు. దే. అ. క్రి. పరిహసించు: చూ, పిసాళించు.

తచ్చేనసేయు. ద్వ. స. క్రి. (తచ్చేన + చేయు) —పై.— పాండు. 1, ఆ. 199.

తటకా. దే. వి. నివ్వెఱ: చూ, వెఱవెఱపాటు.

తటకాపడు. ద్వ. అ. క్రి. చేష్టలుతక్కు. సా- 2, ఆ. 37.

తటకాపాటు. ద్వ. వి. రూ- తటుకుపాటు.

తటతట. దే. వి. గుండెలదరుటలోనగువాని యందగుననుకరణము. ప్రభా. 3, ఆ. 126: చూ, హూహూ.

తటపటాయించె. వా. అ. క్రి. 1. వెనుకముందులు ఆలోచించె; 2. సందేహించె.

తటమట. దే. వి. 1. మోసము: చూ, వంచన; విణ. 2. మోసముగలది. రూ- తటవట: చూ, వంచకము; 3. కలఁతనొందినది. లక్ష్మీ. 4, ఆ. 172: చూ, వ్యాకులము.

తటమటించె. దే. స. క్రి. 1. మోసపుచ్చె: చూ, వంచించె; 2. కలఁచె. భాగ. 4, స్కం. 746: చూ, కలగుండువెట్టు.

తటము. సం. వి. అ. న. 1. పరిమడి: చూ, భూమి. 1. (చూ, పొలము); పుం, న. 2.= తట్టు. రూ-తటి. ఏటిబడ్డు: చూ, రోధస్సు; 3. చోటు: చూ, స్థానము. 1; పుం. 4. కొండచేచెయి: చూ, పర్వతము.

తటవట. దే. వి: చూ, రూ- తటమట. 1-2-3; 4. కల్ల: చూ, వితథము.

తటవటచేయు. దే. స. క్రి: చూ, వంచించె.

తటవిటలు. వా. వి. బ. చిక్కులు.

తటవిట్లు. వా. వి. బ. —పై.—

తటస్థము. సం. విణ. 1. సమీపమందున్నది: చూ, సమీపము. 1; 2. ఒనఁగూడినది: చూ, సిద్ధము. 3; వా. వి. 3. కలుగఁజేసికొనకపోవుట. "తటస్థవృత్తి."

తటస్థించు. సం. అ. క్రి. 1: చూ, సమీపించె; 2: చూ, సిద్ధించె.

తటస్థుఁడు. సం. విణ. 1. న్యాయస్థుఁడు: చూ, సత్యవంతుఁడు; వా. 2. కలుగఁజేసికొనని వాఁడు.

తటాకపరివాహన్యాయము. పా. చెఱువు నీరు తూముగుండా కొంచెముగానైన విడువని యెడల గట్టు బ్రద్దలయి నీరంతయుఁ బోవు నను విధము.

తటాకము. సం. వి. అ. పుం. రూ-తటాగము-తడాకము- తడాగము. చెఱువు: చూ, సరస్సు. 1: అం. 2. సంతానములు ఏడింటి లోనొకటి: చూ, సంతానములు.

తటాగము.—పై.—

తటాన. దే. దక్రి. క్రి. విణ. రూ-తటాలున-తటుకున-తటుక్కున - తడుకున. దబ్బున: చూ, వేగము. 3. [వారించె.

తటాయించె. దే. స. క్రి. అడ్డగించె: చూ,

తటారించె. దే. అ. క్రి. చొచ్చె. ఆం, భా. తృ. 122: చూ, సోఁకు. 4. [మహిషము.

తటార్ధము. సం. వి. అ. పుం. దున్న: చూ,

తటాలు. దే. వి: చూ, తటతట. జై. 6, ఆ.13.

తటాలున. దే. దక్రి. క్రి. విణ: చూ, రూ-తటాన. వసు. 2, ఆ. 83.

తటి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, తటము. 2; 2: చూ, తటము. 3.

తటిత. సం. వి. త్. స్త్రీ. రూ-తటిత్తు-స్తటిత్తు. మెఱుపు: చూ, విద్యుత్తు.

తటిత్తు. సం. వి. త్. స్త్రీ.—పై.—

తటిత్పతి. సం. వి. ఇ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; అం. 2.విద్యుత్తులు ఏడింటిలో నొకటి: చూ, విద్యుత్తులు.

తటిత్వంతము. సం. వి. త్. పుం. రూ-తడిత్వంతము. మబ్బు: చూ, మేఘము. 1.

తటిని. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు: చూ, నది.

తటుకున. దే. దక్రి. క్రి. విణ: చూ, రూ. తటాన. జై. 4, ఆ. 107.

తటుక్కున. దే. దక్రి. క్రి. విణ.—పై.—

తటుకుపాటు. ద్వా. వి: చూ, రూ-తటకాపాటు. ఆం, భా. ప్ర. 132.

తట్ట. దే. వి. 1. తబుకు: చూ, పాత్రము. 6; 2. వెదురుబద్దలులోనగు వానితో నల్లిన పల్లిక, చిన్నగంప (అనికొందఱు) "ఎండుపుతట్ట-తక్కెడతట్ట." మొ: చూ, సజ్జ. 1.

తట్టగిల్లు. దే. అ. క్రి. తట్టయగు. [ఆ. 62.

తట్టము. దే. వి: చూ, టంగువాఱు. కళా. 3,

తట్టస. వై. వి. ధైర్యము. ఉ, హరి. 3, ఆ. 123: చూ, స్థైర్యము. 1.

తట్టాడు. దే. స. క్రి. (తట్టు + ఆడు) (అడుగులు) ఇట్టట్టుఇడు. లక్ష్మి. 3, ఆ. 147.

తట్టి. దే. వి. 1. కంచెము: చూ, పాత్రము.6; 2. తెర. నిర్వ. 5, ఆ. 100: చూ, వేఁటతెర.

తట్టు. వై. వి. 1.=తటమ్. ఒడ్డు: చూ, రోధస్సు; 2. వైపు: చూ, పార్శ్వము. 2; 3.=దండ. రూ-తట్టువ-తట్టువము. గుఱ్ఱము: చూ, హయము; 4.=దండ. రూ-తట్టువ-తట్టువము. కుత్సితాశ్వము, పొట్టిగుఱ్ఱము (అనికొందఱు): చూ, హయము; దే. వి. 5. శబ్దదోషములలో నొకటి; అ. క్రి. 6. కలుగు: చూ, పుట్టు. 2; 7. తోఁచు: చూ, స్ఫురించు. 2; స. క్రి. 8. చేఱచు: చూ, పటతళించు.

తట్టుగాలి. వా. వి. 1. ప్రక్కగాలి; 2. కోపము; 3. చిరాకు; 4. పోవుకాలము (పోయికాలము) "నీకు ఏమితట్టుగాలి వచ్చినదిరా."

తట్టుచేయు. ద్వ. వి. కోటకొమ్మమీఁది అవయవము: చూ, సదనము. 1.

తట్టుపునుఁగు. ద్వ. వి. తట్టియెత్తిన మేలైన పునుఁగు: చూ, పూతిపునుఁగు.

తట్టుముట్టాడు. ద్వ. స. క్రి. (తట్టుముట్టి + ఆడు) (దారిద్ర్యము) చుట్టుకొను: చూ, వేష్టించు.

తట్టువ. వై. వి. =: చూ, రూ-తట్టు. 3-4. (... శాం. 4. ఆ. 113).

తట్టువడు. ద్వ. అ. క్రి. (తట్టు + పడు): చూ, బాధపడు. స్వా. 4, ఆ. 37.

తట్టువము. వై. వి.=: చూ, రూ-తట్టు. 3-4 (కుత్సితాశ్వము.-అచ్చ. బాల, కాం. 37).

తట్టువా. వై. వి.= —పై.—

తట్టువిఱుఁగఁబడు. ద్వ. అ. క్రి. తొప్పరిలఁబడు. ఆం, భా. తృ. 101: చూ, వ్రాలు.3.

తట్రి. వై. వి.=త్వష్ట. బంగారు పనిచేసి బ్రదికెడి జాతి (తట్రివాఁడు-తట్రిది): చూ, స్వర్ణకారుఁడు.

తట్రు. వై. వి.= —పై.—

తడ. దే. వి. 1. ధన్వము * (దీనిభేదము గూబతడ) (గాత్రివృక్షము): చూ, మహాబల; 2. అడ్డి: చూ, వారణము. 1; 3. కడ: చూ, సమీపము. 1.

తడఁబడు. ద్వ. అ. క్రి. (తడ + పడు) 1. తొట్రుపడు: చూ, సంభ్రమించు; 2. వ్యత్యాసపడు. కళా. 3, ఆ. 10: చూ, వ్యత్యస్తమగు; 3. చలించు: చూ, సలించు. (ప్రే. తడఁబఱచు.)

తడఁబాటు. ద్వ. వి. 1: చూ, వ్యత్యయము. స్వా.4, ఆ. 52; 2. చలనము: చూ, లోలము.

తడక. దే. వి. రూ-తడికి-తడికె-తడుక. 1.దడి, ఈఁతబద్దలు లోనగువానితో నల్లి గుడిసెలకు అమర్చెడు తలుపు: చూ, వాకిలి, 2. పక్షుల వేఁటాడువాఁడు మఱుఁగుగా నుంచుకొనెడుసాధనము. భాగ.7,స్కం.53; వా. 3. ఒకానొకధ్వని. "తత్తడక తడక."

తడకట్టు. దే. వి. 1. అడ్డగింత. రా, వి. 3, ఆ. 8: చూ, వారణము. 1; స. క్రి. 2. అడ్డగించు: చూ, వారించు.

తడకదోపరి. దే. వి. తడికతోసివేసి లోపల దూఱెడు దొంగ. రూ-తడికదోపరి-తడికెదోపరి: చూ, ముచ్చు. 1.

తడకాలు. దే. వి. మల్లబంధవిశేషము. ఆం,భా. ద్వి. క్షు. 209 (చూ, విన్నాణములు.)

తడగము. దే. వి. రూ-తణగము- తణగాము- తడాకము. పక్కాలి, పద్మాకరము, ఎద్దు మీఁద నీళ్లుతెచ్చెడు తోలుసంచి: .చూ సంచి. [నడి. 3.

తడప. దే వి. కట్టుగానుండు నార: చూ,

తడపెట్టు. దే. స. క్రి. తడఁబఱచే.

తడయు. దే. అ. క్రి. ఆలస్యముచేయు: చూ, వివరించే. 3. [డియు.

తడవ. దే. వి: సరవాయి, ఆవృత్తి: చూ, వెం

తడవాడు. దే. అ. క్రి. (తడవి + ఆడు)1: చూ, డోఁగాడు; 2. తడఁబడు: చూ, లుకలుక లాడు.

తడవియాడు. దే. అ. క్రి: చూ, డోఁగాడు.

తడవిల్లు. దే. వి. తడబ్రిద్దల విల్లు: చూ, బాణము. 1.

తడవు. దే. వి. 1. రూ-తడువు. ఆలస్యము. భార.ఉద్యో. 4,ఆ. 195: చూ, విలంబము.1; 2. రూ-తడువు. చిరకాలము. (అంతమొదలగు శబ్దములు ముందువచ్చునపుడు ఇది కేవలము కాలవాచకమగును. ఉదా.—అంతతడవు-ఇంతతడవు-ఎంతతడవు-కొంతతడవు మొ.); అ. క్రి. 3. చేతులలో అట్టిట్టు ప్రాఁకు. భార. ఆది. 6, ఆ. 160: చూ, ప్రాఁకు. 4; 4: చూ, డోఁగాడు; స. క్రి. 5: చూ, నిమురు. భార. ద్రో. 3, ఆ. 151; 6: చూ, వెదకు; 7. ప్రస్తావించే. కళా. 3, ఆ. 38: చూ, వచించే; 8: చూ, విచారించే. కళా. 8, ఆ. 256; 9: చూ, రక్షించే. [శివుఁడు. వేం. ఆం. 2.

తడవుఁగనినపట్టిఁగన్నయ్య. ద్వ. వి: చూ,

తడవుట. దే. వి: చూ, వెదకుట. ఆం, భా ద్వి. 173.

తడవుడు. దే.వి.1: చూ, తడవుట; 2. పరామరిక: చూ, విమర్శనము.

తడవుదాల్పు. దే. వి. బ్రహ్మచారి: చూ, వటువు.

తడ(డు)వులనిడుపడు. దే. వి. శేషుఁడు. అచ్చ. యు, కాం. 449: చూ, సర్పము.

తడాకము. సం. వి. అ. పుం: చూ, రూ-తటాకము.

తడాకా. వా. వి. శక్తి. "నాతడాకా చూడుము"; (గోదావరి జిల్లాప్రాంతమున వాడుక)

తడాగము. సం. వి. అ. పుం. 1: చూ. రూ-తటాకము; 2. బంగారు కడియము: చూ, భూషణము. 2.

తడి. దే. వి. 1. తేమ: చూ, పదను. 2; 2. నీరు: చూ, సలిలము; విణ. 3. తేమగలది: చూ, వోదము.

తడిక. దే. వి: చూ, రూ-తడక.

తడికదోప్రరి. దే. వి. (తడిక + తోప్రరి): చూ, రూ-తడక దోపరి.

తడికె. దే. వి: చూ, రూ-తడక.

తడికెదోపరి. దే. వి: చూ, రూ-తడకదోపరి.

తడిత్తు. సం. వి. త్. స్త్రీ: చూ, తటిత్తు.

తడితీయు. దే. అ. క్రి. ఆఱు: చూ, మిడుకు.8.

తడిత్వంతము. సం. వి. త్. పుం: చూ, రూ-తటిత్వంతము. [గానుండునది.

తడిపొడి. దే. విణ. కొంచెము తడిగలిగి పొడి

తడిప్రాఁతను గొంతుఁగోయుట. జా. చోఁప క్రిందినీటివలె తెలియనీయకుండఁగ ఆయాసపెట్టు చేంపుట. "ఉడుపతి హిమఘృణిచే బలెఁ, దడిప్రాఁతం గొంతుఁగోయు తగవె తెఁగితివో." (పాంచాలీపరిణయము)

తడిబట్ట. దే. వి. తడిసినబట్ట: చూ, వస్త్రము.

తడియు. దే. అ. క్రి. ఇవముకొను: చూ, నాను.

తడియొత్తు. దే. వి. (తడి + ఒత్తు) తడితుడుచే కొనుగుడ్డ: చూ, వస్త్రము.

తడుక. దే. వి: చూ, రూ-తడక.

తడుకు. దే. వి. 1. తోఁట లోనగువానిచుట్టు నేర్పఱచెడు వెలుగు. స్వా. 4, ఆ. 37: చూ, ప్రాచీనము. 1; 2. తెట్టుకొఱకు ముండ్లనల్లిన తడుక. ఆం, భా. తృ. 34: చూ, బొందెము. [కున.

తడుకున. దే. ద్రి. క్రి. విణ: చూ, రూ-తటు

తడుపంచే. దే. వి. 1. చిన్నబట్ట. రూ-తడుపంచె-తడుపు, పొత్తియ-రూ-పొత్తె: చూ, వస్త్రము; 2. తడిసినబట్ట: చూ, తడిబట్ట.

తడుపంచె. దే. వి. —పై.—

తడుపాత. వా. వి. —పై.—

తడుపు. దే. వి. 1. గోఁచి: చూ, బొట్టము; 2. చిన్నబట్ట. జై. 8, ఆ. 26: చూ, తడుపంచే. 1; 3. తడిసినబట్ట. కాశీ. 2, ఆ. 75: చూ, తడుపంచే. 2; విణ. 4. తడిసినది (వస్త్రము); ప్రే. 5. తడియఁజేయు.

తడుపుదాలుపు. దే. వి. (తడుపు + తాలుపు) బ్రహ్మచారి: చూ, వటువు.

తడుము. దే.స. క్రి. 1: చూ, నిమురు. స్వా.4, ఆ. 30; అ. క్రి. 2: చూ, యోచించే.

తడువు. దే. వి: చూ-రూ-తడవు. 1.2.

తడువుతీర్పు. దే. వి. విలంబితము. [తెడ్డు.

తడ్డు. సం. వి. ఉ. పుం. నావనడపుతెడ్డు: చూ,

తడ్డువు. సం. వి. ఉ. పుం.=తెడ్డు. —పై.—

తణగము. దే. వి: చూ, రూ-తడగము.

తణగాము. దే. వి. —పై.—

తణగామొద్దు. దే. వి. నీళ్లుతెచ్చెడి యెద్దు: చూ, వృషభము. 1.

తత్. సం. విణ. న్. 1. మఱియొకటి; అవ్య. 2. కారణము: చూ, హేతువు. 1.

తతగము. సం. వి. అ. పుం. గాలి: చూ, వాయువు.

తతము. సం. వి. అ. పుం, 1: చూ, తతగము; విణ. 2. విరివియైనది; 3. వ్యాపించినది: చూ, విపులము; అం. 4. వాద్యచతుష్టయమునందొకటి: వాదిత్రము (చూ, ఆతోద్యము) (చూ, వీణె) (చూ, తతవాద్యములు.)

తతవాద్యములు. అం. పరివాదిని, చతుర్దశి, ఏకాదశి, త్రయోదశి, మహతి, బృహతి, కలావతి, కచ్ఛపి, వితతము, పినాకిని, పౌర్ణమి, రావణహస్తము, ఉదుంబరము, షట్కర్ణము, హస్తభము, సారంగి, ఆలాపిని, రుద్రవీణ, వ్యాళీముఖము, ఐల. (20) (వీణాదులు తతములు.): చూ, వాద్యములు.

తతి. సం. వి. ఇ. స్త్రీ. 1. గుంపు: చూ, సమూహము; దే. వి. (1) కాలము. య.1, ఆ.95: చూ, సమయము.

తతిమ్మా. వా. విణ. మిగతా, తక్కిన.

తత్క్షణము. వా. సం. అవ్య. అప్పుడు: చూ, సద్యము.

తత్తడి. దే. వి. గుఱ్ఱము: చూ, హయము.

తత్తడిసెక్కుదంట. దే. వి. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు. [సేన. 1.

తత్తబడ. దే.వి.దండు. ఉ, హరి.3,ఆ.116.చూ,

తత్తరపాటు. వై. వి.=తంద్రా. రూ-తత్తరము-తత్తఱ-తత్తఱపాటు-తత్తఱము: చూ, సంభ్రమము. 1.

తత్తరము. వై. వి.=—పై—

తత్తఱ. వై. వి.=—పై.—(దేశ్యమని శ. ర.)

తత్తఱపడు. ద్వా. అ. క్రి: చూ, సంభ్రమించే.

తత్తఱపాటు. వై. వి=: చూ, రూ-తత్తరపాటు (ద్వయము అని శ. ర.)

తత్తఱపెట్టు. దే. స. క్రి. తత్తఱపఱచే.

తత్తఱము. వై. వి.=: చూ, రూ-తత్తరము. (ఆం, భా. ప్ర. 140)

తత్తటించు. దే. అ. క్రి. రూ-తత్తటిలు-తత్తటిల్లు. 1: చూ, సంభ్రమించు; 2: చూ, సలించు. [7, ఆ. 76.)

తత్తటిలు. దే. అ. క్రి.—పై-(చలించు.-కళా.

తత్తటిల్లు. దే. అ. క్రి.—పై.—

తత్తెర. దే. వి. సారాయిపోసెడుతిత్తి: చూ, సారాయితిత్తి. [చూ, లుబ్ధుఁడు. 2.

తత్పరుఁడు. సం. విశ. (ఒకట) ఆసగలవాఁడు:

తత్పురుషము. పా. తత్పురుషమునే వ్యధికరణము, అసమానాధికరణము అనివాడెదరు. ప్రథమాతత్పురుష, నఞ్ తత్పురుష సంస్కృతమందు మాత్రమే కలవు. నిర్జనములోనగు వానిని కొందఱునఞ్ తత్పురుషలను కొందురు. అదికాదు. అవి అవ్యయీభావసమాసములు. అయోగ్యము, అశక్తి, అనేకము మొదలైనవి నఞ్ తత్పురుషములు. ద్వితీయాతత్పురుషము-నెలదాల్పు; తృతీయా-నెలతక్కువ, చతుర్థి-బ్రాహ్మణ సంతర్పణము, పంచమి-చోరభయము, షష్ఠి-మల్లెపూవు, సప్తమి-దైవభక్తి. అతీంద్రుఁడు, కుంభకారుఁడు, తత్వజ్ఞుఁడు ప్రభృతులు సంకరతత్పురుషములని తెలియునది) తత్పురుషము అయిదు విధంబులు.— సమానాధికరణము, వ్యధికరణము, నఞ్, ప్రాది, ఉపపదము: చూ, సమాసము. 1; అం. 2. శివానములుఅయిదింటిలో నొకటి: చూ, శివావనములు.

తత్ర. సం. అవ్య. 1. తతార్థకము. (శ. ప):- అందు, అట, అక్కడ, అగ్గడ, అచట-రూ-అచ్చట-అచ్చోట, అయ్యెడ- రూ-ఆయెడ-ఆడ; 2. కూడుకొనియుండుట; 3. పాటిపోవుట.

తత్రత్యము. సం. విశ. అక్కడకలిగినది.

తత్రభవానుఁడు. సం. వి. త్. పుం: చూ, శ్లాఘ్యుఁడు. [చూ, హంసుఁడు.2.

తత్వజ్ఞుఁడు. సం. విశ. తత్వముతెలిసినవాఁడు:

తత్వము. సం. వి. అ. న. 1. పరమాత్మ : చూ, హంసుఁడు. 2; 2. స్వభావము : చూ, రూపు. 3; 3: చూ, ఘనము. 1; (పంచవింశతితత్వములు.— అష్టప్రకృతులు షోడశవికారములు పురుషుఁడు.);4.పదార్థము: చూ, వస్తువు; అం. 5 ఆకాశములుఅయిదింటిలో నొకటి: చూ, ఆకాశములు.

తత్వశంబరము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు:

తత్సతి. సం. వి. ఈ. స్త్రీ. ఆమె: చూ, స్త్రీ.

తత్సమక్రియలు. పా. సంస్కృతధాత్వాదులకు 'ఇంచు' చేర్పఁగానైనవి తత్సమక్రియలు: చూ, క్రియలు.

తత్సమము. పా. సంస్కృతశబ్దముతోను బ్రాకృతశబ్దముతోను సమానమైనరూపముగలది.

తత్సము. సం. వి. అ. పుం. ఎరవేసినమాంసము: చూ, మాంసము.

తథా. సం. అవ్య. 1. వలెను. పోలికయందు వర్తించును. (వత్, వా, యథా, తథా,ఇవ, ఏవం ఈఆఱును పోలికయందు వర్తించును.); 2: అలాగు- రూ- ఆలాగు; 3. పరస్పరనిరపేక్షములగు నవయవవస్తువులకు నొక క్రియతో సంబంధముగలుగుట; 4. పరమార్థము; 5. ఉత్తరువుచేయుట; 6. నిశ్చయము:చూ, సత్యము; 7. నిరూపించుట; 8. లెస్స: చూ, శుభము. 1; 9. సాంతము; 10. యోగ్యమగు పని.

తథాగతుఁడు. సం. వి.అ.పుం:చూ,బుద్ధుఁడు.1.

తథ్యము. సం. వి. అ. న. 1: చూ, సత్యము; విశ. 2. సత్యమైనది: చూ, సత్యము.

తథ్యానుజుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతిగ్రహము : చూ, రాహువు. 2.

తదా. సం. అవ్య. అప్పుడు: చూ, సద్యము.

తదాత్వము. సం. వి. అ. న. ఆకాలము.

తదాముఖము. సం. వి. అ. న. ఆరంభము:చూ, యత్నము.

తదియ. వై. వి.=తృతీయా. రూ-తద్దె. 1.పక్షమునందు మూఁడవతిథి: చూ, హరివాసము; అం. 2. శుక్లపక్షతిథులు పదునేనింటిలో నొకటి: చూ, శుక్లపక్షతిథులు; 3. కృష్ణపక్షతిథులు పదునేనింటిలో నొకటి:చూ, కృష్ణపక్షతిథులు.

తదీయము. సం. విణ. తత్సంబంధమైనది.

తద్గుణము. అం. 1. అలంకారములునూటెంటిలో నొకటి (తనగుణమువిడిచి యన్యసంపర్కముచే తద్గుణమువచ్చుట." "చెలినుత్తైమధర కాంతచేఁ బవడమయ్యె": చూ, అలంకారము. 3; 2. ఆగుణము.

తద్ద. దే. అవ్య. భృశార్థకము. "తద్దతగదు, తద్దనెమ్మి". చూ, నెట్టన.

తద్దయు. దే. ద్వి.—పై.—

తద్దినము. సం. వి. అ. న. 1. ఆదినము, ప్రత్యాబ్దికము (వాడుకయందు మృతిఁబొందిన దినము),ఏఁడుడి,ఆబ్దికము:చూ,సాంవత్సరికము.

తద్దు. సం. వి. ఉ. పుం.=తెడ్డు, నావ నడపునది, తండువు: చూ, పీలి. 2.

తద్దె. దే. వి. 1. ఉత్సవము. "అట్లతద్దె, ఉండ్రాళ్ళతద్దె.": చూ, పండుగ. 2; వై. వి. 2.=: చూ, రూ-తదియ.

తద్ధర్మాద్యర్థకము. (లాట్టు) పా. తద్ధర్మాద్యర్థకంబున డుజితరంబులు పరంబులగునపుడు దుగాగమంబగు. ఉ. చేయుదును=చేయుదుము= మ. చేయుదువు = చేయుదురు. ప్ర. చేయును= చేయుదురు. (డుజితరంబులు= డుజ్జునకంటె నన్యములైనవి)

తద్భవము. పా. వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములచేఁదద్భవంబులగు. (వర్ణలోపము.- భోజనమ్-బోనము. ఇటజకారమునకు లోపము; వర్ణాగమము.— రథః- అరదము. ఇచేట "అ"యాగమము;వర్ణవ్యత్యయము.- శుచిః-చిచ్చు, కక్షః- చంక, చంద్రః-చందురుఁడు, సముద్రుఁడు-సంద్రము ఇవిసంస్కృతభవములు. ప్రవాళమ్-పవడము, కాంస్యమ్-కంచు ఇవి ప్రాకృతభవములు.)

తద్భవిష్యము. సం. విణ. దైవపరము, ఏభ్యరాశి.

తనంతగలయతఁడు. వా. వి. నలువ: చూ, బ్రహ్మ. 1.

తనకన్నమిడినవాఁడు. అం. గయాపిండదానార్హులలో నొకఁడు.(ఇట్లు గయాపిండ దానార్హులలో చేరెడువారు తనతోఁబుట్టువు, తన దాయాదులు, తనపెదతండ్రి, తనబిడ్డలు, తన భార్య, తనయన్నదమ్ములు లోనగువారు): చూ, గయాపిండదానార్హులు.

తనకలి. దే. వి. 1. చిక్కు, సంకటము: చూ, శోకము; విణ. 2. చిక్కుఁగలది; 3. చిక్కులఁబెట్టువాఁడు. ఉ, హరి. 3. ఆ. 133:చూ, సూచకుఁడు. 1. [కము.

తనకా, తనఖా. వా. వి. తాకట్టు: చూ, వార

తనికీ, తనిఖీ. వా. వి. శోధన.

తనజన్మనక్షత్రము. అం. తానుపుట్టిననక్షత్రము, ప్రకాశింపఁజేయుఁగూడనివగు పదునొకండింటిలో నొకటి: చూ, ప్రకాశింపఁజేయఁగూడనివి. [మాతలు.

తనతల్లి. అం.మాతలయిదుగురిలో నొకతె:చూ,

తనదీపమని ముద్దుపెట్టుకొనిన నోరుకాలును. లో. ఉదా.— "ఇంటిదీపమనుచే నిగిలించుకొని ముద్దుపెట్టుకొన్న నోరుబెట్టుగాలు, నృపుల సమ్ముఖంబు నెవరు వెంచుచు జేను, వాఁడు మిగులఁ బరిభవంబునొందు." (కుచేలోపాఖ్యానము.)

తనము. సం. వి. అ. పుం. 1. చందనము: చూ, వాసన. 1; 2. చిత్తము:చూ,హృదయము,2;

వై. అప. (1)=త్వమ్: భావార్థమునందు వచ్చెడు ఒకప్రత్యయము. "గొప్పతనము. చిన్నతనము." మొ. [ప్రతిక. 1.

తనయ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు: చూ,

తనయుఁడు. సం. వి. అ. పుం. కొడుకు: చూ, పుత్రుఁడు. 1.

తనరారు. ద్వి. అ. క్రి. (తనరు + ఆరు) రూ-తనరు. 1. అతిశయించు: చూ, ముమ్మరించు; 2. ఉన్నతమగు, నిక్కు-. భార. విరా. 1, ఆ. 162: చూ, పొడుగు. 6.

తనరు. వై. వి. 1. మంజులము: చూ, హృద్యము; అ. క్రి. రూ-తనరారు. 2. అతిశయించు. భా. ఆది. 7, ఆ. 180: చూ, ముమ్మరించు; 3: చూ, తనరారు. 2; 4. ఒప్పు: చూ, సమ్మతించు; 5.=తనర్: చూ, విజృంభించు. భార. విరా. 2. ఆ. 133.

తనరుచు. వై. అ. క్రి. రూ- తనర్చు: చూ, రూ- తనరు. 2-3-4-5; అం. ప్రే. 6. తనరఁజేయు. లక్ష్మి. 4, ఆ. 8.

తనర్చు. వై. అ. క్రి. —పై.—

తనరుపు. వై. వి. రూ-తనర్పు. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2. ఉన్నతము: చూ, పొడవు 2; 3. విశాలము: చూ, విస్తారము.1; 4: చూ, సంతోషము.

తనర్పు. వై. వి. —పై.— (పొడవునకు.— భార. సభా. 1, ఆ. 62; అతిశయమునకు.- భార. స్త్రీ. 1, ఆ. 88)

తనవయస్సు. అం. తన యేండ్లు. పరికాశింపఁ జేయఁగూడనివగు పదునొకండింటిలో నొకటి: చూ, పరికాశింపఁ జేయఁగూడనివి.

తనాబి. దే. వి. స్తంభములమీఁదిగోడకు క్రింద వేసెడు పెద్దపలక: చూ, మదనచేతులు.

తని. వై. విశ. 1. అల్పము. జై. 6, ఆ. 85: చూ, స్వల్పము; 2.=తనుః. అలఁతి: చూ, సూక్ష్మము. 4.

తనిమము. సం. వి. న్. పుం. 1. కార్శ్యము: చూ, అవస్థలు; 2: చూ, విస్తారము. 1; 3. శరీరత.

తనియు. దే. అ. క్రి: చూ, తృప్తిపడు.

తనియువాఁడు. దే. వి: ఆపోవువాఁడు. (సం. ప).—ఆప్యాయిత. [సాహిత్యము.

తనివి. దే. వి. రూ-తనువు. తృప్తి: చూ,

తనివిలేనివాఁడు, దే. వి: చూ, అతృప్తుఁడు.

తనివు. దే. వి: చూ, రూ-తనివి.

తనివెచ్చ. దే. వి. ఇనుమంతకాఁక: చూ, మందోష్ణము (చూ, వేఁడిమి.)

తనివోవు. దే. అ. క్రి. (తనివి + పోవు): చూ, తనియు.

తనిసను. దే. అ. క్రి. (తనివి + చేను) -పై.-

తనిసినవాఁడు. దే. వి: చూ, ఆప్యాయితుఁడు.

తను. దే. విశ. వృత్తియందు తనువుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. నిర్వ. 4, ఆ. 78.

తనుకాంతి. పా. దీనికి ఉపమానములు.—బంగరువు, మెఱుపుతీఁగె, కుందనము, పచ్చపసుపుకొమ్ము.

తనుకు. దే. వి. 1. రూ-తన్కు-. తాపము: చూ, సంతాపము; అ.క్రి. 2.కలుగు. భార.సభా.1, ఆ. 42: చూ, పుట్టు. 2; 3. జ్వలించు.భార. ఆది. 2, ఆ. 199: చూ, మండు.1; 4: చూ, పరికాశించు. ఉ. హరి. 4, ఆ. 89; 5.తపించు: చూ, సంతాపించు.

తనుగంధము. పా. దీనికి ఉపమానములు.— కర్పూరము, ఉత్పలము, పాటలపుష్పము, పద్మము, పువ్వు, మంచిగందము, మొగలిపువ్వు.

